శ్రీ

వేదాధికారవిషయమయిన

# ఉపన్యాసము.

---


బ్రహ్మశ్రీ

ఆత్తూరి హవిర్యాజి-లక్ష్మీనృసింహ

దీక్షితులుగారిచే.


---


మద్రాసు:

మెసర్సు. అడిసన్ అండు కంపెనివారి ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియెను.

1895 సం॥ ఫిబ్రవరినెల 1 తేది.

---

వెల. రూ. 0-4-0.

ఆత్మూరి హావిర్యాజి - లక్ష్మీనృసింహ॰

దీక్షితులుగారిచే.

---

బ్రహ్మశ్రీ వైశ్యయతి
శ్రాద్ధానందస్వామినః

# పీఠిక.

కృష్ణాది॥ యిలాకా జగ్గయ్యపేట గ్రామములోనుండెడు బ్రాహ్మణులు ఈ క్రింద ఉదహరింపబడిన పత్రికను ప్రకటించి బ్రహ్మశ్రీ ఆత్మూరి లక్ష్మీనృసింహదీక్షితులువారికి పంపించియుండగా అట్టి ఉపన్యాసముయొక్క అనంతరము ప్రత్యుత్తరము చెప్పుటకు నిశ్చయించినయెడల తాము వచ్చెదమని జగ్గయ్యపేట పోష్టుమేష్టరు గారైన మ. కుశాలరావుగారిద్వారా కబురు పంపించగా అందుకు ఆ బ్రాహ్మణులు సంతోషముగా ఒప్పుకొన్నామని ప్రత్యుత్తరమిచ్చిన పయిని దీక్షితులవారున్ను సబ్ మేజస్ట్రీటుగారున్ను పోలీసు ఇన్‌స్పెక్టరుగారున్ను పోష్టుమేష్టరుగారున్ను 1000-మందికిపైగా అనేక బ్రాహ్మణులు, వైశ్యులు, దేవస్థానములో సభజేరిరి, గాని తాము చేయు ఉపన్యాసానంతరము, దీక్షితులుగారు ఉత్తరువు యిచ్చుటకు నొప్పుకోనందున దీక్షితులుగారున్ను, వారితో వచ్చిన అనేకులున్ను, ఆసభనుంచి తిరిగి వెళ్లిపోయిరి. ఆ సభలో దీక్షితులువారు చెప్పవలసిన అంశములను ప్రకటనచేసినయెడల సమస్తమయినవారికి ఉపకారముగానుండునని వారిని కోరగా వారు మాకు పంపించిన ఉపన్యాసమును ఇందుమూలముగా ప్రకటించుచున్నారము. గనుక ఇందుకు సదరు జగ్గయ్యపేట బ్రాహ్మణులుగాని మరియెవరైనాగాని, యేమతాభిమతులయినాగాని ఆక్షేపణ పంపించినయెడల అందుకు జవాబు దీక్షితులువారి పేర వ్రాయించి తెప్పించుచున్నాము. కనుక రహస్యముగా నీ మూలను, ఆ మూలను ఆక్షేపణలుచెయ్యక, ధైర్యశాలులయినయెడలనున్ను యథార్థము వాదించవలెనని యిచ్ఛయున్నవారైనను ఇందుకు జవాబు పంపింపుదురని కోరుచున్నాము. ఇందుకు జవాబు పంపించని యెడల మాకు సహాయభూతులయి వేదోక్త కర్మాచరణమును ప్రయత్నించుదురని శ్రియఃపతిని ప్రార్థించుచున్నాను.

చి. సోమసుందరం.



# పత్రిక.

---

శ్రీ శంకరగురుభ్యోనమః.

౧౯౨౫సం॥ ది-౮ జనవరితారీఖున శ్రీ చంద్రమౌళీశ్వరస్వామివారి ఆలయములో పగలు ఘం- 3 ల కాలమున శ్రీ శృంగగిరి సంస్థానవిద్వాంసులగు బ్రహ్మశ్రీ పూర్ణానందశాస్త్రిగారు వేదోక్త కర్మాధికారమునుగురించి ఉపన్యసించుదురు కావున సర్వజనులును విజయంచేయుటకు కోరబడుచున్నారు.

బ్రహ్మశ్రీ చేతనభొట్ల రాజేశ్వరశాస్త్రిగారు అగ్రాసనాధిపతిగానుండుటకు అనుగ్రహపూర్వకముగ నంగీకరించినారు.

జగ్గయ్యపేట,
3 జనవరి ౨౫.

ఇట్లు:
కర్వనా-లక్ష్మీకాంతయ్య

# PURPORT OF THE LECTURE

BY

A. LAKSHMI NARASIMHA DEEKSHIT GARU.

(1) That Brahmins, Kshatrias and Vaisyas have a right to Vedoktakarmas.

(2) That Brahmins, Kshatrias and Vaisyas do exist in the Kaliyuga.

(3) That Honorable Subrahmanya Ayer Garu, the Honorable Bhashyam Ayangar Garu, the Honorable Sree Sree Sree Vizianagaram Maharajah's Head Manager, Brahma Sree V. V. Kodanda Row Pantulu Garu, are members of the Brahmin caste community. That the Maharajah of Oodayapur, the Maharajah of Vizianagaram, and the Rajah of Kallikota, who lately performed Yagyam in the Ganjam District, &c., are members of the Kshatria community. That the Zemindar of Gutal (Manyamvaru), the Zemindar of Malakapele (Gunduvaru), and the Zemindar of Vemureddipalem (Majetivaru), &c., are members of the Vaisya community.

(4) The enclosed Sreemukhas, &c., establish the above facts.

(5) That if anybody wishes to oppose them, he should boldly come forward to confront the same. There is no use of idle talk in this corner and in that corner. If he cannot do so, let him put forth his shoulders to the Vedic cause and propagate its pure principles.

(6) The lecture is silent about the rights of the Sudras, which will form the subject of a separate lecture.

---

# ఉపన్యాసము.

---

ఓ ఆర్యోత్తములారా, వైషమ్యములు మాని నిర్మలమైన బుద్ధితో శాంతముగ, నే చెప్పబోవు చిన్నవాక్యములను వినుడి, శాస్త్రచర్చ నేను చేయబూనుకొనలేదు. మతగురువులగు శ్రీ శంకరాచార్యులు మొదలగువారి పత్రికలను మాత్రమే ముఖ్యముగ తమకు తెలియజేయుచున్నాను. వారి ఆజ్ఞనుమీరక వారి ఉద్దేశమును భంగము కలుగ చేయక మీరందరు, ఏకగ్రీవులై వేదోక్తములయిన నిర్మలసిద్ధాంతములను వ్యాపింప జేసి వేదకర్మలను ఆచరించునటుల ప్రోత్సాహపడుటకుగాను మనమందరము ప్రయత్నముచేయవలయును. శ్రీ శృంగిగిరి సంస్థాన విద్వాంసులగు బ్రహ్మశ్రీ పూర్ణానంద శాస్త్రులవారు ఈరోజున ఉపన్యాసముచేయుటకు ప్రకటించిన నోటీసులోని అంశము బహు తృప్తికరముగాను, ఆనందకరముగాను ఉన్నది. వారు ఈ యంశము విషయమయి యేమి ఉపన్యాసముచేయ నిశ్చయించినను వారిస్థానే నేను యీ క్రింది అంశములను ఉపన్యసించెదను. ఇది వారికి అంగీకారము అయినయెడల సంతోషమేను. లేదా వారికి ఆక్షేపణ ఉన్నయెడల ఆసంగతిని ప్రమాణములతో తెలియచేసినయెడల నా పొరపాటు ఉన్నయెడల దిద్దుకొనెయదను గనుక వారుగాని మరి యెవరయినాగాని ఇందుకు ముఖ్యముగ జవాబు పంపించ కోరెదను.

1. వేదోక్తాధికారము, బ్రాహ్మణ, క్షత్రియ వైశ్యులకు కలదు.

2. కలియుగమునందు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు, కలరు.

3. (1) ఆనరేబిల్ సుబ్రహ్మణ్యం అయ్యరుగారు.

(2) ఆనరేబిల్ భాష్యం అయ్యంగారు.

(3) ఆనరేబిల్ శ్రీశ్రీశ్రీ విజయనగరం మహారాజావారి హెడ్ మానేజరు వారగు బ్రహ్మశ్రీ వి. వెంకటకోదండరావు పంతులుగారు, మొదలగువారు బ్రాహ్మణులు; (1) ఉదయపూరు మహారాజావారు, (2) విజయనగరం మహారాజావారు, (3) కల్లికోట రాజావారు, మొదలగువారు క్షత్రియులు; (1) గూటాలజమీందారుగారు, (2) మలకపల్లిజమీందారుగారు, (3) వేమురెడ్డిపాలేం జమీందారుగారు, మొదలగువారు వైశ్యులు.

వీరు చిరకాలము వేదోక్తకర్మలను ఆచరించుచున్నారు.

## ఇందుకు ప్రమాణములు క్లుప్తముగ దెల్పెద.

౧. శ్రీ ఆదిశంకరులవారి శ్రీముఖము.
౨. శ్రీ ఆదిరామానుజులవారి శ్రీముఖము.
౩. శ్రీ విద్యారణ్యస్వాములవారి శ్రీముఖము.
౪. శ్రీ శృంగేరిస్వాములవారి శ్రీముఖము.
౫. శ్రీ విరూపాక్షస్వాములవారి శ్రీముఖము.
౬. శ్రీ పుష్పగిరిస్వాములవారి శ్రీముఖము.
౭. శ్రీ జీయ్యంగారి శ్రీముఖము.
౮. శ్రీ శృంగగిరి శివగంగస్వాములవారి శ్రీముఖము.
౯. మదరాసు హైకోర్టువారి తీర్పు.
౧౦. సబ్ కోర్టులోని రాజీనామా.

## శ్రీముఖములు.

### ౧. శ్రీ ఆదిశంకరాచార్యులవారి శ్రీముఖము.

ఓ ఆర్యోత్తములారా, శ్రీముఖమనగ యేమియో ఆలోచించుడు. యతీశ్వరులు, లోకోపకారార్థము వారి అనుగ్రహపూర్వకముగా తమ తాత్పర్యమును లిఖితపూర్వకముగ తెలియజేయు ఆజ్ఞ. కలియుగమునందు వేదోక్తమతము నశించి, కర్మభ్రష్టులై, ఉంచుండగ భగవంతుడు శంకరాచార్యులవారిద్వారా, శ్రీభగవద్గీతాది భాష్యములను వ్యాపింపచేసెను; శంకరాచార్యులవారు తమమతమును తెలియచేసినదియే శ్రీముఖము. భగవద్గీతయొక్క ౧౮-వ అధ్యాయము ౪౦-వ శ్లోకము. బ్రాహ్మణ, క్షత్రియ, విశ అనెడి శ్లోకమునకు రచించిన భాష్యము వేదాధికారమునుగురించిన శ్రీముఖమైయున్నది.

అది యేదనగా :—

శ్రీముఖము.

**బ్రాహ్మణాశ్చ, క్షత్రియాశ్చ, విశశ్చ, బ్రాహ్మణ క్షత్రియవిశః, తేషాం, బ్రాహ్మణ క్షత్రియవిశాం, శూద్రాణాంచ, శూద్రాణాం, అసమాసకరణం, ఏకజాతిత్వేసతి, వేదాన అనధికారాత్.**

దీని అర్థము.

ఈ శ్లోకమునందు, బ్రాహ్మణ, క్షత్రియ, విశాం అని యేకసమాసమున్ను, శూద్రాణాం అని భిన్నపదమున్ను వాడుకచేయబడినవి. ఇందుకు కారణము వ్రాయుచు

శ్రీ శంకరాచార్యులవారు ఈయుగమునందు మనము ఆచరించుటకు ధర్మములు చెప్ప బూనుకొన్నవారై, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు వేదాధికారముకలదని, తెలియ జేసినారు. గనుక ఈ శ్రీముఖమువలన మేముచెప్పిన మొదటి అంశము రుజువు అయినది.

## ౨. శ్రీ రామానుజాచార్యులవారి శ్రీముఖము.

భగవద్గీతయొక్క ౧౭-వ అధ్యాయము, ౨౩-వ శ్లోకముయొక్క భాష్యము నందు వీరు ఆనతిచ్చిన శ్రీముఖము.

శ్రీముఖము.

“ అతో వైదికానాం, త్రైవర్ణికానాం, యజ్ఞే తపసి, దానేచస్థితిః. కళ్యాణతయా సదిత్యుచ్యతే, కర్మచ, తదర్థీయం, త్రైవర్ణికార్థీయం, యజ్ఞదానాదికం. సదిత్యేవ అభిధియ్యతే, తస్మాత్, వేద, వైదికాని కర్మాణి, బ్రాహ్మణశబ్దనిర్దిష్టాః, త్రైవర్ణికాః.”

ఇందువలన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు, యజ్ఞాది వైదికకర్మలు స్థిరపడు చున్నవి. ఈ యుగమునందు మతస్థాపకులయిన వీరియొక్కవాక్యము అంగీకరించని వారి విషయమై యేమిచేయవలసియుండునో మీరే ఆలోచించుడీ.

## 3. శ్రీ విద్యారణ్యస్వాములవారి శ్రీముఖము.

(విద్యారణ్యులవారెవరో చెప్పెద వినుడీ.)

వీరు ప్రస్తుతమందు, మనము వాడుకొనుచున్నట్టిన్ని, కలియుగమునకు ముఖ్య మైనట్టిన్ని పరాశరస్మృతికి గొప్పభాష్యములు చేసినవారు.

వీరికి ఆశ్రమమునకు పూర్వము మాధవాచార్యులని పేరుండుటంబట్టి ఆ భాష్య మునకు మాధవీయమని పేరుకలిగినది. వీరు భుక్కమహారాజువద్ద దివానులున్ను, శంకరపీఠస్థులున్ను, సర్వవేదములకు భాష్యములుచేసినవారున్ను అయిఉన్నారు. ఇట్టి వీరి వాక్యమునైనా మీరు మన్నించరా; కలియుగమునకు మనకర్మలు చేసుకొనుటకు గాను యేర్పడ్డ పరాశరస్మృతియొక్క భాష్యములో వీరు వ్రాసినవాక్యమనెడి శ్రీము ఖము.

శ్రీముఖము.

“ త్రైవర్ణికమాత్రాధికారాహి శ్రుతిః ప్రసిద్ధా । ఓంకారస్తథావిధః సావిత్రీం ప్రణవం - యజుర్లక్ష్మీం స్త్రీశూద్రాణాం నేచ్ఛంతీతి శ్రుతేః ”

దీని అర్థము.

బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు, ఓంకారము, సావిత్రీ, అధికారముకలదు.

## 4. శ్రీ శృంగగిరిస్వాములవారి శ్రీముఖము.

దీనిఅసలు మాకు దొరకలేదుగాని సర్వన్యాయసభలకు ఆధిక్యమయిన, ప్రీ, వి, కౌన్సిల్ వారుచేసిన, సీమతీర్పులో ముఖ్య ఆచార్యులు, (చీఫ్ప్రీస్టు) వారివలన శ్రీముఖమివ్వంబడినటుల వ్రాయంబడియున్నది గనుక అసలు లేకపోయినప్పటికి యిటువంటి తీర్పులో వ్రాసియున్నప్పుడెంతమాత్రము వివేకమున్నవారైనను ఒప్పుకొనక తప్పరు. అయితే సదరు తీర్పులో శృంగగిరివారు యిచ్చినట్టు వ్రాయంబడియుండలేదుగాని ముఖ్యమయిన ఆచార్యులవారని (చీఫ్అని) ఉదహరింపంబడుటవల్లనున్ను శృంగేరి పీఠము ఇతర శంకరాచార్యులవారి పీఠములకంటె ముఖ్యమని, వారేమి, శృంగేరివారేమి యితరులుయేమి వాడుకొనుటవల్లనున్ను, వేదోక్తకర్మ చేయించవలసినదని ఆజ్ఞాపించినటుల అందులో వ్రాసియుండడమున్ను, ఆ ప్రకారముగా ఆజ్ఞాపించు అధికారము శృంగేరివారిదని లోకప్రతీతి అయివుండుటంబట్టిన్ని (చీఫ్ప్రీస్టు) అనగా శృంగేరి శంకరాచార్యులువారని మేము వ్రాసినాము. అటుల కాదనిన్ని బ్రాహ్మణులకు ఆజ్ఞాపించెడి ముఖ్యపీఠము వేరే ఉన్నదనిన్ని చూపించేయెడల సవరణచేయడమవుచున్నది.

అది యేదనగా.

"For the plaintiffs, certain documents were tendered, * * * * * * A mandate from the chief priest to one Mamedy Venkia, setting forth and alleging the rights of the Vaisya, or third class, to the performance of the Upanayana according to the Vedas, and commanding the performance of that ceremony in accordance with the Vedas."

శ్రీముఖము.

వాదులతరఫున కొన్ని దస్తావేజులు దాఖలయినవి. వాటిలో నొకటి ముఖ్యాచార్యులవారు (శృంగగిరి శంకరాచార్యులవారు) మామిడి వెంకయ్యగారికి జారీచేయించిన శ్రీముఖము దానిలో ఉదహరింపంబడిన అంశములు యేమనిన, తృతీయవర్ణస్థులకు అనగ వైశ్యులకు వేదోక్తప్రకారము ఉపనయనము జరిగించుకొను హక్కుగలదు. వేదోక్తప్రకారము ఆకర్మను జరిగించవలసినదిగా మేము ఆజ్ఞాపిస్తున్నాము.

## శ్రీముఖము.

367 పేజీలో ఈవిషయమయి ప్రథమకోర్టువారు అనగా జిల్లాకోర్టువారు ఇచ్చినతీర్పు 1818-సంవత్సరం జూన్ తే 20 ది అయివున్నట్టు వ్రాయబడియున్నది. అందువలన నీ శ్రీముఖము అంతకు పూర్వమే దాఖలుకాబడి యుండవలెను గనుక ఈ శ్రీముఖము బహు ప్రాచీనమైనదిగా మేమెంచుచున్నాము.

ఆతీర్పులోనుండేడి వాక్యములను వినవలెనని మీకు కుతూహలముండినయెడల దానిని తీర్పులో ఉదహరించినరీతిని ఇచట వ్రాయుచున్నారము.

"On the 27th of June 1818, the Court pronounced its decree, whereby it was declared that the people of the Comatie's caste might lawfully have the Soobha and Asoobha ceremonies performed in their houses, and in the language of the Vedas by Brahmins, and that whosoever should hereafter interrupt, or attempt to interrupt, the performance of any of those ceremonies, in the manner aforesaid, would be liable to be proceeded against, for resisting a decree of Court; and be directed each party to bear their own costs."

### దీనికి తాత్పర్యము.

1818-సంవత్సరం జూన్ తే 27 దిని కోర్టువారు తీర్పుచెప్పినారు. ఆతీర్పులో వ్రాయబడిన అంశములు యేమనగా: కోమటివర్ణస్థులు వారి వారియొక్క శుభాశుభ కర్మములను వారి గృహములందు వేదమంత్రములతోటి బ్రాహ్మణులచేత శాస్త్రోక్తముగా జరిగించుకోవలసియున్నది. ఇంతటినుంచి వారు ఆ కర్మలను యథావిధిగా జరిగించుకొనడమందు ఎవరైన ఆటంకపెట్టినను ఆటంకపెట్టుటకు ప్రయత్నముచేసినను కోర్టువారి డిక్రీని తిరస్కరించినట్టు ఎంచబడి శిక్షకు అర్హులగుదురు. మరియు ఈ యుభయకక్షులవారు ఎవరిఖర్చులు వారే భరించుకోవలసినది.

### ఈ దావాలో పార్టీలపేర్లు.

మామిడి లింగయ్య, చిట్టూరి వీరయ్య, నంబూరి వెంకటదాసు. } వాదులు.

కానుకోలను రామయ్య, కానుకోలను నాగన్న, కాజ కొండావధానులు. } ప్రతివాదులు.

## ౫. శ్రీ విరూపాక్షస్వాములవారి శ్రీముఖము.




శ్రీముఖము.

“ శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య పదవాక్య ప్రమాణపారావార పారీణ యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహారధ్యానధారణ సమాధ్యష్టాంగయోగానుష్ఠాన నిష్ఠాగరిష్ఠతపశ్చక్రవర్త్యనాద్యవిచ్ఛిన్న గురుపరంపరాప్రాప్త షడ్దర్శనస్థాపనాచార్య వ్యాఖ్యాన సింహాసనాధీశ్వర సకలవేదార్థప్రకాశక సాంఖ్యత్రయీప్రతిపాలక నిగమాగమసారహృదయ వైదికమార్గప్రవర్తక శ్రీ ఋష్యశృంగపురవరాధీశ్వర తుంగభద్రాతీరనివాస శ్రీవిరూపాక్ష విద్యానగరాది మహారాజధానీ కర్ణాటక సింహాసనాధీశ్వర సర్వతంత్ర స్వతంత్ర శ్రీమద్రాజాధిరాజ మహారాజ గురుభూమండలాచార్యత్వాద్యన్వర్థ సకలబిరుదావళీ విరాజమాన శ్రీమదభినవ నృసింహ శంకర భారతీకరకమలసంజాత శ్రీవిద్యాశంకరపాదపద్మారాధక శ్రీమదభినవోద్దండ శంకర భారతీగురుస్వామిభిరనుగృహీతా ధర్మశాస్త్రమీమాంసేయం.

వైశ్యానామిజ్యాధ్యయనాద్యధికారోవిషయః సవైశ్యానామస్తివానవేతిసంశయః॥ శ్రు॥ అష్టవర్షం బ్రాహ్మణముపనయీతేత్యాదిశ్రుత్యా బ్రాహ్మణానాం, రాజా రాజసూయేనయజేతేత్యాదిశ్రుత్యా ఉపనయనంవినా రాజసూయయాగస్య కర్తుమశక్యత్వేన క్షత్రియాణాంచోపనయనసంస్కారస్యచోదితత్వేన తాదృశసంస్కారస్యైవాధ్యయన హేతుత్వేన ఇజ్యాధ్యయనాద్యధికారః బ్రహ్మక్షత్రియయోరేవ న వైశ్యస్యేతి పూర్వపక్షః॥

సిద్ధాంతస్తు: విప్రాధికారికోపనయనోపయోగి వయోవిశేష క్షత్రియాధికారిక క్రతువిశేషోపక్రమోపసంహృతిమాత్ర నివృత్త్యోపన్యస్త శ్రుతివిహితోపనయనాపేక్షితాజినాది సంభారవిధాన ప్రవృత్తి పరిష్కృతస్య తదనిషిద్ధ వైశ్యాధికార విధాయకశాస్త్రస్య తద్వైకకంఠ్యస్యైవ వక్తుముచితత్వేన తత్ప్రాతికూల్యస్య శశవిషాణసోదరత్వాత్.

ఆపస్తంబసూత్రే॥ గర్భాష్టమేషు బ్రాహ్మణముపనయీత । గర్భైకాదశేషు రాజన్యం । గర్భద్వాదశేషు వైశ్యమితి వైశ్యానాముపనయనయోగ్యకాలవిధానాత్ ॥ మనుస్మృతౌ ॥ గర్భాష్టమేబ్దేకుర్వీత బ్రాహ్మణస్యోపనాయనం । గర్భాదే

కాదశేరాజ్ఞోగర్భాత్తు ద్వాదశేవిశఇతి నిత్యకాలస్య ॥ బ్రహ్మవర్చసకామస్య కార్యం విప్రస్యపఞ్చమె । రాజ్ఞోబలార్థినష్షష్ఠె వైశ్యస్యేహార్థినోష్టమ ఇతి కామ్యకాలస్య ॥ ఆషోడశాద్బ్రాహ్మణస్య సావిత్రీనాతివర్తతె । ఆద్వావింశాత్ క్షత్రబంధోరాచతుర్వింశతేర్విశ ఇతి నైమిత్తికకాలస్యచ ॥ అత ఊర్ధ్వంత్రయోప్యేతె యథాకాలమసంస్కృతాః । సావిత్రీపతితావ్రాత్యాభవంత్యార్యవిగర్హితాః ఇత్యుపనయనాకరణె ప్రత్యవాయస్య । నైతైరపూతైర్విధివదాపద్యపిహికర్హిచిత్ । బ్రాహ్మాన్ యౌనాంశ్చ సంబంధానాచరెద్బ్రాహ్మణస్సహ। ఇత్యాదినా ఉపనయనాకరణే కన్యాదానాది సంబంధనిషెధస్యచ । కార్ష్ణరౌరవబాస్తాని చర్మాణిబ్రహ్మచారిణః । వసీరన్నానుపూర్వ్యేణ శాణక్షౌమావికానిచేతి వర్ణవిశేషెణ చర్మవిశెషస్య వస్త్రవిశెషస్యచ । మౌంజీత్రివృత్సమాశ్లక్ష్ణాకార్యంవిప్రస్యమెఖలా । క్షత్రియస్యతుమౌర్వీజ్యా వైశ్యస్యశణతాంతవీతి వైశ్యవర్ణత్వేన మెఖలావిశెషస్య । కార్పాసముపవీతంస్యాద్విప్రస్యోర్ధ్వవృతంత్రివృత్ । శణసూత్రమయంరాజ్ఞో వైశ్యస్యావికసౌత్రికమితి వర్ణవిశెషెణోపవీతవిశెషస్య । బ్రాహ్మణోబైల్వపాలాశౌక్షత్రియోవాటఖాదిరౌ । పైప్పలౌదుంబరౌవైశ్యో దండానర్హన్తి ధర్మత ఇతి వర్ణవిశెష ధర్మత్వేన దండవిశెషస్యచ। కెశాంతికోబ్రాహ్మణస్య దండఃకార్యః ప్రమాణతః । లలాటసమ్మితోరాజ్ఞస్స్యాత్తునాసాంతికోవిశ ఇతి తృతీయవర్ణత్వేన మానభేదస్యచవిధానాత్ వైశ్యానాం కంఠత ఏవోపనయనస్య విహితత్వాత్ ॥

యాజ్ఞవల్క్యస్మృతౌ ॥ బ్రహ్మక్షత్రియ విట్ఛూద్రావర్ణాస్త్వాద్యాస్త్రయోద్విజాః। నిషెకాద్యాశ్శ్మశానాంతాస్తేషాంవైమన్త్రతఃక్రియా ఇతి వైశ్యానాం ద్విజత్వ ప్రతిపాదనద్వారా । గర్భాధానాది పైతృమెధికాంతానాం షోడశకర్మణాం వైదికమన్త్రైరెవ కర్తవ్యత్వవిధానాత్ ॥ అగ్నికార్యం తతఃకుర్యాత్సంధ్యయోరుభయోరపి । తతోభివాదయెద్వృద్ధానసావహమితిబ్రువన్నితి బ్రాహ్మణబ్రహ్మచారిణామివ వైశ్యబ్రహ్మచారిణామపి సంధ్యాద్వయెప్యగ్నికార్యవిధానాత్ ॥ ఆదిమధ్యావసానెషు భవచ్ఛబ్దోపలక్షితా। బ్రాహ్మణక్షత్రియవిశాం భైక్షచర్యాయథాక్రమమితి బ్రాహ్మణక్షత్రియవటోరివ వైశ్యవటోరపి శబ్దసంధానవినిమయెన భైక్షాచరణస్య నియమితత్వాత్ ॥ ప్రతివేదం బ్రహ్మచర్యం ద్వాదశాబ్దాని పఞ్చవా । గ్రహణాంతికమిత్యేకె కెశాంతశ్చైవ షోడశ ఇతి వైశ్యవటోరపి వెదవెదె ద్వాదశాబ్దకాలనియమెన బ్రాహ్మణానామివ బ్రహ్మచర్యకథనాత్ । మాతుర్యదగ్రెజాయన్తే ద్వితీయంమౌంజిబంధనాత్ । బ్రాహ్మణ క్షత్రియ విశస్తస్మాదెతెద్విజాస్స్మృతా ఇతి వైశ్యానామపి మాతృగర్భనిస్సరణ మౌంజీబంధనాత్మకోపాధిద్వయప్రయుక్త జన్మద్వయమనూద్య ద్విజత్వోపన్యాసముఖెనెజ్యాధ్యయనాదెః కథితత్వాత్ । యజ్ఞానాంతపసాంచైవ శుభానాంచైవకర్మణాం । వేదఏవ ద్విజాతీనాం నిశ్రెయసకరఃపర ఇతి జన్మద్వయయుత వైశ్యానామపి వేదాధ్యయన

స్యైవ సర్వకర్మ సార్థక్యకథనద్వారా మోక్షోపయోగిత్వోపపాదనాచ్చ । ఉపనయనే తద్ద్వారా వేదాధ్యయనే ఇజ్యాయాంచ వైశ్యానామధికారస్సకల స్మృతివిహితత్వేనా క్షత ఏవేతి.

ప్రయోజనంతు "మంగళాచారయుక్తానాం నిత్యంచప్రయతాత్మనాం । జపతాం జుహ్వతాంచైవ వినిపాతోనవిద్యతే । అనేన జపహోమాదిభిర్లౌకిక వైదికోపద్రవా భావః ॥ వేదమేవాభ్యసేన్నిత్యం యథాకాలమతంద్రితః । తంహ్యస్యాహుఃపరంధర్మ ముపధర్మోన్యఉచ్యతే । అనేన వేదాభ్యాసఏవోత్కృష్టధర్మః ॥ వేదాభ్యాసేనసతతం శౌచేనతపసైవచ । అద్రోహేణైవభూతానాం జాతిం స్మరతిపౌర్వకీం । అనేనపూర్వ జన్మజ్ఞానం ॥ పౌర్వకీంసంస్మరన్ జాతిం బ్రహ్మైవాభ్యసతేపునః । బ్రహ్మాభ్యాసేనచాజ స్రమనంతంసుఖమశ్నుతే ॥ అనేన పూర్వజన్మజ్ఞానద్వారా వైరాగ్యాదిలాభేన శ్రవణ మననాదిలబ్ధ బ్రహ్మసాక్షాత్కారరూప మోక్షశ్చసంభవతీతి సర్వమవదాతం । అస్మిన్భ రతఖండే స్మృత్యుక్తోపనయనాధ్యయనాది యోగ్యాః బ్రహ్మక్షత్రియవైశ్యసంజ్ఞాఃత్ర యోద్విజాతివర్ణాః విద్యంతే॥ శ్రీకాకుళంగ్రామవాసీ పాలూరి శంకరనారాయణశ్రేష్ఠీ ఉదాహృతవర్ణానాంమధ్యే తృతీయవర్ణప్రసూతః ॥

సతు అత్రత్య బ్రాహ్మణైః క్షత్రియైశ్చస్మృత్యుక్త తృతీయవర్ణజ ఇతివ్యవహ్రి యతే॥ తద్వర్ణోత్కృష్టస్తృతీయవర్ణోఽస్మిన్ దేశేనాస్తి॥ అతః అత్రత్య సకలశిష్ట వ్యవ హారేణ తృతీయవర్ణత్వేన వ్యవహృతత్వాదయముపనయనాధ్యయనాధికారయోగ్య త్వేన శాస్త్రోక్తద్విజవర్ణాంతర్గత వైశ్యవర్ణోత్పన్న ఇతి వివేచయామః ॥

విరోధివర్షే వైశాఖే శుక్లపక్షే భృగోర్దినే ।
తృతీయాయాం నిర్మితేయం విశాఖపురిపత్రికా ॥




కొందరీ శ్రీముఖమును సదరు స్వాములవారే రద్దుచేసుకున్నారని అనుచున్నా రుగాని శంకరపీఠస్థులును, బ్రాహ్మణగురువులును, సత్యపరిపాలకులును, అయిన వీరే "అస్మిన్భరతఖండే స్మృత్యుక్తోపనయన అధ్యయనాదియోగ్యాః బ్రహ్మ క్షత్రియ వైశ్య సంజ్ఞాః త్రయోద్విజాతివర్ణాః విద్యంతే" అని వర్తమానకాల ధాతువును ప్రయోగించిన వాక్యమునకు విరుద్ధముగా స్వవచనఘాతకపరులవుదురనెడి వాక్యము నితరులు వాడు కచేసినను అస్మదాదులమట్టివాక్యమును అనకూడదు. వినకూడదు. ఒకవేళ వారట్టి పొరబాటుచేసినేని పక్షపాతములేక గురువులనైనా దండించు అధికారముగల హై కోర్టువారు న్యాయమివ్వరా.

## ౬. శ్రీ పుష్పగిరివారి శ్రీముఖము.

శ్రీ విద్యాశంకరులు.

నంబరు. ౫౦౧.

శ్రీ

శ్రీ పుష్పగిరి సంస్థానం
విద్యానృసిహ్మభారతి స్వామినః
విద్యాశంకర భారతి స్వామినః.
(నాగరము.)

శ్రీ

శ్రీ పుష్పగిరి సంస్థానం
విద్యానృసిహ్మ భారతి స్వామినః
విద్యాశంకర భారతి స్వామినః.
(తెనుగు.)



శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య పదవాక్యప్రమాణ పారావారపారీణ యమనియమాసనప్రాణాయామ ప్రత్యాహారధ్యానధారణ సమాధ్యష్టాంగయోగాను ష్ఠాననిష్ఠాగరిష్ఠతపశ్చక్రవర్త్యనాద్యవిచ్ఛిన్న గురుపరంపరాప్రాప్తసాంప్రదాయక షణ్మత స్థాపనాచార్య వ్యాఖ్యానసింహాసనాధీశ్వర సకలవేదార్థప్రకాశక సాంఖ్యత్రయీ ప్రతిపాలక సకలనిగమాగమసారహృదయ వైదికమార్గప్రవర్తక సర్వతంత్రస్వతంత్రాది రాజధానివిద్యానగర మహారాజధాని కర్ణాటకసింహాసనప్రతిష్ఠాపనాచార్య శ్రీమద్రాజా ధిరాజ మహారాజ గురుభూమండలాచార్య తుంగభద్రాతీరవాస ఋష్యశృంగగిరిపుర వరాధీశ్వర శ్రీశృంగగిరి శ్రీవిరూపాక్ష శ్రీపుష్పగిరి పినాకినీతీరవాస శ్రీశైల శ్రీ అలం కర్యాది సమస్తపీఠాధీశ్వర శ్రీమదభినవోద్దండ విద్యానృసింహభారతీగురుపాదపద్మారా ధక శ్రీమదభినవోద్దండ విద్యాశంకరభారతీకరకమలసంజాతశ్రీమదభినవోద్దండ విద్యా నృసింహభారతిస్వాములవారు శ్రీమద్రమారమణచరణ చరణారవిందామందనిష్యందమ రందబిందు సందోహనిరంతరాస్వాదనతుందిలందిందిరాయమానమానసులయిన శ్రీకృష్ణవ ర్యసోదయాలంకృతులయిన అస్మదత్యంతప్రియశిష్యులయిన జగ్గయ్యపేట రాజశ్రీ అశో **మనూట ఇబ్బంద్రు నగరంవారగు వైశ్యబృందములకు ఇత్యాధికోఖండైశ్వ ర్యాభివృద్ధికొరకు వ్రాయించి పంపించిన నారాయణస్మరణపత్రికా. తదనంతరం మేమున్నూ ఏతద్వార్షిక చాతుర్మాస్య దీక్షాసంకల్పమునకు గుడివాడ తాలూకా గురజగ్రామం అశేషబ్రాహ్మణ సభవారియొక్క, కమ్మవారియొక్క ప్రార్థనాతిశయము చేత విజయంచేసి శ్రీవారి పూజాసంజనితానందాబ్ధినిమగ్నస్వాన్తులమయి యున్నారము. తెలియవలెను. ఏతశ్చరంన్నవరాత్రదేవి మహోత్సవములు యిచ్చటనే పరిసమాప్తికా**

గలదని తలంచినారము. తదీయోత్సవమునకు యుష్మన్నివాసగ్రామమునకు విజయం చేయవలసినదిగా భవదీయులకు సంకల్పము కల్గియున్నపక్షముకు అచ్చటికి విజయం చేయవలయుననిన్ని ఇచ్ఛయించి ఇత్యాద్యర్థములు మీకు తెలియగలందులకున్ను అనంతకల్యాణ పరంపరాభివృద్ధికొఱకున్ను పత్రికాఫలమంత్రాక్షతవ్యాసాక్షతలు సన్నిధిశిష్యులద్వారా ప్రేషితులయినవి. సుసమయస్వీకారధురంధరులు తాము ను ఇందునిమిత్తం ముఖ్య శిష్యులకు పత్రికాద్వారా విశేషం వ్రాయించవలసినది యేమియున్నది. ఇతినారాయణస్మరణపత్రికా. జయసంవత్సర శ్రావణ శు॥ 3 లు.

ఈ శ్రీముఖమువలన నూటయిబ్బంద్రునగరంవారనెడు కోమటులు వైశ్యులె అని స్థిరపడుచున్నది.

## ౭. శ్రీ జియ్యంగారి శ్రీముఖము.



శ్రీమతే రామానుజాయనమః ॥

మంగళాశాసనపూర్వకం ప్రేషితేయం శ్రీముఖపత్రికా.

శ్రీమత్కాంచీపురీవిరాజమానాచార్య పదపీఠాధిష్ఠితమహితమ ఠాధీశ్వరైః శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యైః శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యోభయవేదాన్తప్రవర్తక శాంతశమదమాద్యనన్తక ల్యాణగుణపరిపూర్ణైః శ్రీవాదికేసరి శ్రీమత్సౌమ్యజామాతృముని వరైః శ్రౌతస్మార్తకర్మనిష్ఠాగరిష్ఠానాం సకలాత్మగుణసంపన్నానాం భగ వద్భాగవతాచార్యకైంకర్యాసక్తానాం వేదవేదార్థప్రవీణానాం వైశ్య వంశపారావారసుధాకరాణాం కౌత్ససగోత్రోత్పన్నానాం ఆత్మకూరి లక్ష్మీనృసింహదీక్షితానాం.

ఇదానీం అత్ర సద్గ్రంథకాలక్షేపాదిభిస్సమం భగవతో దేవదేవస్య శ్రీమతో వరద రాజస్య నిత్యోత్సవాదయోభివర్ధన్తె తత్రత్య భావత్కపుత్రపౌత్రాదిభిస్సహ కుశలోదన్తపత్రికా ప్రేషణీయా.

మేము శ్రీ తిరునారాయణపురము అహోబిలము సేవించి యీదివసంబున బందరు బచ్చుపేటయందు తట్టయివారిరామానుజకూటమునకు వేంచేసి పెరుమాళ్ తిరువారాధనకాలక్షేపములు జరిగించుచున్నారముగావున మీరందరు సబాంధవులతో పెరుమాళ్లను సేవించిపోవలయును.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

ఇత్యనేకవేదోక్త మంగళాశాసనములు.

జయసంవత్సర జ్యేష్ఠశుద్ధ త్రయోదశి స్థిరవారం.

శ్రీ, కంచి, వాదికేసరి, అళగియమణవాళ రామానుజ అయ్యంగారు.



ఈ శ్రీముఖము ఒక్కమా పేరనే పుట్టినప్పటికి వీటివలన వైశ్యులకు శ్రౌతస్మార్తాధికారము కలదని స్థిరపడుచున్నది.

౮. శ్రీ శృంగగిరి శివగంగస్వాములవారి శ్రీముఖము.

సెం ॥ ౧౧౭౫.



15-10-94.

శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యవర్యేత్యాది సమస్తబిరుదాంకిత శ్రీ శృంగేరీ శ్రీ శివగంగా శ్రీ సుబ్రహ్మణ్యాభినవ సచ్చిదానన్ద భారతీస్వాములవారు.

బృందావనపురనివాసులును శ్రీకాకుళం డిస్ట్రిక్టు మునసబువారున్నూ వైశ్య కులోద్భవులున్నూ అగు ఆత్మకూరి లక్ష్మీనృసింహదీక్షితులుగారికి వ్రాయించిన నిరూప మేమనగా.

ఈ ౧౮౯౪ సం॥ ఆగష్టునెల ౨౪ తేది సాయంత్రము శ్రీ చంద్రమౌళీశ్వర సన్నిధానమందు మా సమక్షమున మీరు భగవద్గీతానిగూఢార్థోపన్యాసమును కేవల శ్లాఘ్యముగా చేసినందుకు, మీ ప్రతిభకు మేము చాలా సంతుష్టాంతరంగులమైతిమి. మీయొక్క ప్రయత్నము కేవలము లోకోపకారమయియున్నది గనుక లోకములో నుండు వైశ్యులందరును తమకుగల వేదోక్తబాధ్యత ననుసరించి శాస్త్రవిదిత కర్మలనాచరించి శ్రేయోభివృద్ధిని పొందవలయునని శ్రీ చంద్రమౌళీశ్వరుని ప్రార్థిస్తు న్నాము.

౧౮౯౪ సం॥
అక్టోబరునెల ౧౪ తేది
శ్రీ సంస్థానం సవారీ మకాం.
మదరాసు.

శ్రీ. సు. బ్ర.

ఈ స్వాములవారికి మనదేశమునందు అధికారము లేకపోయినను వీరు గొప్ప పండితులును జ్ఞానులును అయి వుండుటయే గాక శ్రీ శృంగగిరి స్వాములవారివద్ద భాష్యశాంతికూడా చేసియున్నారు. ఈ పత్రిక యీ జయసంవత్సరములోనే పుట్టి యున్నది. అవిచ్ఛిన్నముగ వైశ్యులకు వేదోక్తము జరుగుతున్నటుల ౯౦ సంవత్సరము లకు పూర్వము, శృంగేరీవారు ఇచ్చిన పత్రికవలన ప్రస్తుతమందు వీరు యిచ్చిన పత్రికవలన స్థిరపడుచున్నది.

## ౯. మద్రాసు హైకోర్టువారి తీర్పు.

మద్రాసు తీర్పు వాలం 13 పేజి 215. 1889 సంవత్సరం ॥

డిశంబరునెల 12 తేది.

జడ్జీలపేర్లు.
ప్రథమజడ్జి కాలెన్సుథొరగారు.
ముత్తుసామి అయ్యగారు :—వీరు వైదికబ్రాహ్మణులు.

పూర్వవత్తుతీర్పు వ్రాయుట ఇచట ప్రయోజనములేదు. ప్రస్తుతపు అంశముకు జరూరు ఎంతో అంతే వ్రాయుచున్నారము.

ఇందులోని పార్టీలు.

## రంగనాయకమ్మ, ఎదిరి ఆళ్వారుశెట్టి.

,,ఆయావర్ణస్థుల ఆచారప్రకారము జాతాశౌచ మృతాశౌచములు ప్రారంభమవు తవిగాని ఆవిషయమయి ప్రసంగించుట ఆవశ్యకములేదు. ఎందువల్లననగా చంచయ్య

అనే అతను వర్ణమువల్ల వైశ్యుడు. ద్విజాతులయినటువంటి ౩-వ వర్ణములో చేరినవాడయినప్పటికిని దత్తహోమము జరుగబడనట్టు ఒప్పుకొనబడుచున్నది. శింగమ్మ, ఎదిరి రామానుజాచార్యులు. కేసులో బ్రాహ్మణులలో సహితము దత్తహోమము జరూరులేదని తీర్పుచేసియున్నప్పటికి గోవిందయ్యరు ఎదిరి దొరసామి కేసులో ఫుల్ బెంచి, అందరుజడ్జీలు ఆ తీర్పును రద్దుచేసి పైమూడువర్ణములవారిలోను దత్తహోమము దత్తతకు ఆవశ్యకమనిన్ని ఏకగోత్రమయినయడల హోమము జరూరులేదనిన్ని తీర్పుచెప్పబడినది. ఇంతేకాకుండా యీసిద్ధాంతము మహాశోయషోషినాథుగోష్ ఎదిరి శ్రీమతి కృష్ణసుందరదాసి, కేసులో సీమతీర్పులోకూడా ఉదహరింపంబడియున్నది. సీమ జడ్జీలు చెప్పినదేమనగా, శూద్రులలోమాత్రము ఇవ్వడము పుచ్చుకోవడము తప్ప ఇతరకర్మలు జరూరులేదనిన్ని యితరవిషయములలో హిందూశాస్త్రాచారము ఎటులవున్నదో అటులనే జరుగుతూవుండవలసినదనిన్ని ద్విజాతివర్ణములలో కేవలము ఇచ్చి పుచ్చుకోవడముద్వారా దత్తత స్థిరపడదనిన్ని, ఎందువల్లననగా కొన్నికర్మలు ముఖ్యముగా దత్తహోమము వారిలో ఆవశ్యకము గనుక.” ఇందువలన చంచయ్య మొదలగువారు వైశ్యులే అనిన్ని వారు ద్విజాతులనిన్ని వారికి దత్తహోమము జరగవలసినదనిన్ని శూద్రులకుమాత్రమే దత్తహోమము జరూరులేదనిన్ని యేర్పడుచున్నది. అయితే దత్తహోమము వేదమంత్రములతోకాకుండా పురాణమంత్రములతో చేయించడమౌనని కుతర్కికులు వాదించవచ్చును. అట్టివాదమును శాస్త్రము బాగాతెలిసినవారు చేయరనుటకు నీ హైకోర్టువారే తీర్పుచేసియున్నారు.

శూద్రులలో దత్తహోమము ఆవశ్యకము లేకపోవడమునకున్నూ బ్రహ్మక్షత్రియ వైశ్యులకుమాత్రము దత్తహోమము ఆవశ్యకమనుటకు కారణమాలోచించినారా! ఆకారణము ఆలోచించినయడల మీకు నిట్టి సందేహనివృత్తి కలుగును. మదరాసు హైకోర్టుతీర్పులో చెప్పినవాక్యమును వినుడి.

“శూద్రులు దత్తహోమమును చేయుటకు అర్హులుకారు. ఎందువల్లననగా వేదమంత్రముల నుచ్చరించుటకు వారికి అర్హతలేదు.”

## EXTRACTS.

Pollution consequent on birth or death arises according to the usage of the caste to which the parties belong at the moment of birth or death. It is, however, unnecessary to dwell further on this point, as datta homam was admittedly not performed, though Chenchayya was a Vaisya by caste and belonged to the third of the regenerate classes. Though datta homam was declared not to be indispensable even among Brahmins in the case of Singamma *v.* Ramanuja Charlu (1), yet it was held in Govindayyar *v.* Dorasami (2) by the Full Bench that it might be necessary to a cere-

monial adoption, that adopton among the three higher classes was ceremonial, and that unless the adoption was from the same Gotram, an inquiry as to Hindu usage in this presidency would be material. This view was confirmed by the observations of the Privy Council in Mahashaya Shosinath Ghose and Sreemati Krishna Soondari Dasi (3). Their Lordships say in that case that "All that has been decided is that amongst Sudras no ceremonies are necessary in addition to the giving and taking of the child in adoption. The mode of giving and taking a child in adoption continues to stand on Hindu law and usage, and it is perfectly clear that amongst the twice-born classes, there could be no such adoption by deed, because certain religious ceremonies, the datta homam in particular, are in their case requisite." (Page 219, Vol. XIII.)

11-వ వాల్యుము 6 పేజీలో ఫుల్ బెంచీతీర్పు, అనగా పూర్ణమయిన జడ్జీలు చెప్పినతీర్పుప్రకారం వైశ్యులలో దత్తహోమము జరిగించుటకు వేదమంత్రము లావశ్యకమయినవిగనుక,

ఓబ్రాహ్మణోత్తములారా, మేము సీమతీర్పును మద్రాస్ హైకోర్టుతీర్పును అంగీకరించి శ్రీస్వాములవారి యాజ్ఞాప్రకారం వేదమంత్రముల నుచ్చరించవలయునా, లేక మీలో కొందరి పయిసంగతులు తెలియక వాదించుచున్నరీతిని పురాణోక్తము చేసుకొనవలయునా, అనుసంగతిని మీరు నెమ్మదిగా కూర్చునప్పుడు నిష్పక్షపాతముగా నాలోచించి వ్రాయించిన చాలాసంతోషించుచున్నారము.

సదరుతీర్పు.

# THE INDIAN LAW REPORTS.

## Madras Series.

VOL. XI., PAGE 6.

**Judgment**:—"The question which is referred to the Full Bench in this second appeal is whether datta homam is an imperative part of a valid adoption in Southern India. That ceremonial adoption is not indispensable among Sudras may now be taken to be concluded by authority. So it was held by the Privy Council in 1879 in regard to Bengal, in Indromoni Chowdhrani *v.* Behari Lal Mullick (1) and by the late Supreme Court of Madras in the case of Veeraperumall Pillay *v.* Narrain Pillay (2), Singamma *v.* Ramanuja Charlu (3), decided by the High Court of Madras in 1868, is also an authority, and in Chandramala *v.* Muktamala (4),

the only doubt appeared to be if it was correct law in regard to the three higher classes only. In support of the course of decisions, there is also the fact that Sudras are incompetent to recite Vedic texts, and that such texts are prescribed for the performance of datta homam."

౧౦. సబుక్కోర్టు రాజీనామా.

| | |
|---|---|
| Atmoory Lakshminarasimha Dikshitulu Garu, B.A. and B.L. | *Plaintiff.* |
| Rai Bahadur Valluri Jagannadha Rao Pantulu Garu. | *Defendant.* |

M. P. 100 of 1893.

In the Honorable Subordinate Court, Vizagapatam, petition presented under Sec. 375, C. P. C., by plaintiff and defendant in O. S. No. 43 of 1892, on the file of the Subordinate Court of Vizagapatam.

Defendant begs to submit that in his judgment in C. C. No. 8 of 1892 on the file of the Deputy Magistrate of Vizianagaram, he has nowhere stated that the Aryan Vysya community has become absolutely extinct. He does not wish to contest the plaintiff's allegations in the plaint that the plaintiff is an Arya Vysya, and that the plaintiff, his family and his ancestors and some other Vysya families also have been observing Vedic rites.

2. Plaintiff begs to add that he is satisfied with the above assurance of the defendant, and he gives up his other claims against defendant.

3. Both parties request the Court to pass a decree in the above terms.

4. Both parties have agreed to bear their own costs as advised by their friends.

(Signed) A. L. NARASIMHAM,
*Plaintiff,* Rajahmundry.

3-4-93. ( „ ) V. JAGANNATHA ROW,
*Defendant,* Rajahmundry.

(Signed) F. E. SICE, *Pleader for Plaintiff.*
( „ ) H. RAMSBOTHAM, *Pleader for Plaintiff.*
( „ ) A. SURYANARAYANA RAO, *Pleader for Defendant.*

15-4-93.

రాజీనామా తెనుగు తర్జుమా.

## వాదిగారు, ఆత్మూరి లక్ష్మీనృసింహా దీక్షితులుగారు B.A. B.L.

## ప్రతివాదిగారు, వల్లూరి జగన్నాధరావుపంతులుగారు రాయిబహద్దూరు.

## M. P. 100 of 1893.

ఆనరెబిల్ సబార్డినేటుకోర్టులో

విశాఖపట్నం సబార్డినేటుకోర్టు ఫైల్ Os. 43 నెంబరున వాదిగారివల్లనున్ను ప్రతివాదిగారివల్లనున్ను సివిల్ ప్రొసిడ్యూరుకోడు శె 375 ను ప్రకారము దాఖలు కాబడిన పిటీషను.

ప్రతివాదిగారు మనివిచేసేదేమనగా, విజయనగరం డిప్యూటీ మేజస్ట్రేటుకోర్టు ఫైల్ 1892 సం॥రం 8 నెంబరు క్యాలండరు కేసులో మేము యిచ్చిన తీర్పులో ఆర్యవైశ్యులు యావన్మంది సంపూర్తిగా నశించినారని చెప్పలేదు. ఇంతేగాకుండా వాదిగారు ప్లయింటులో వ్రాసిన అంశములు అనగా వాదిగారు ఆర్యవైశ్యులు అనిన్ని వారున్ను వారికుటుంబస్థులున్ను వారిపూర్వీకులున్ను మరికొందరు వైశ్యులున్ను కూడా వేదోక్తకర్మలను చేయుచున్నారనే విషయమును గురించి ప్రతివాదిగారి ఆక్షేపణలేదు.

2. వాదిగారు మనివిచేసేదేమనగా, ప్రతివాదిగారు పైనిచెప్పిన నిశ్చయవాక్యముతో తృప్తిపొందినాము గనుక ప్రతివాదిగారి విషయమై యితర పరిహారమును మేము మానుకొన్నాము.

3. పైచెప్పిన షరతులప్రకారం డిక్రీచేయవలసినదిగా ఉభయపార్టీలము కోరుచున్నాము.

4. స్నేహితులుచెప్పిన సలహాప్రకారము యవరిఖర్చులు వారమే భరించుటకు ఒప్పుకొనుచున్నాము.

వాదిగారు ఏ. ఎల్. నరసింహం

అని వున్నది.

రాజమహేంద్రవరము.

ప్రతివాదిగారు వి. జగన్నాధరావు

అని వున్నది.

రాజమహేంద్రవరము.

3. 4. 93.

| | | | |
|---|---|---|---|
| ఎఫ్. ఇ. శెని<br>హెచ్చి. రామ్సుబాతమ్ | అనివున్నది. | వాదిగారి ప్లీడరుగార్లు. | |

ఎ. సూర్యనారాయణరావు అనివున్నది. ప్రతివాదిగారి ప్లీడరుగారు.

ప్రస్తుతము 2 క్లాసు డిప్యూటీకలక్టరుపనిలోవున్నటువంటిన్ని రాయబహాదూరు అనుకితాబును పొందినటువంటిన్ని బ్రహ్మసూత్రములకు అర్థమును ప్రకటించుచున్నట్టిన్ని చాలా పాండిత్యము కలిగినటువంటిన్ని మహారాజశ్రీ, వల్లూరు జగన్నాథరావు పంతులుగారు మీలో కొందరివలెనే ప్రథమమందు పొరబాటుపడినప్పటికిన్ని వారు పరిజ్ఞాతులగుటచేత శాస్త్రములను బాగా పరిశీలనచేసి ఆచారమును బాగా కనుక్కొని మేము అనాదిసిద్ధముగ వేదోక్తకర్మల నాచరించుచున్నారని స్పష్టముగా పబ్లీకుగా కోర్టులో ఒప్పుకొనియుండగా మీకు నింక సంశయమేల, గనుక ఈదశపత్రికలను మీరు బాగాచూచి ఇంతటినుంచియైనను బేజరూరు ఆక్షేపణలను మానివేసి శాస్త్రసమ్మతముగ కర్మలను జరుపుతూ వేదమతమును లోకమందు స్థాపించవలెనని కోరుచున్నాము.

కొందరికి మరియొక సంశయముకలదు. వైశ్యులకు వేదాధికారముకలదుగాని పద్మపురాణమందు చెప్పంబడిన శాపమువలన వీరికి అట్టి అర్హతపోయినదని కొందరు చెప్పెదరు. అయితే యీశాపము కల్పనకు కర్తఅయిన దుబ్బాక వెంకటాచలశాస్త్రిల వారు అది కేవలము అబద్ధమనిన్ని తాను పొరబాటుచేసినాననిన్ని అట్టిశాపము పద్మపురాణములో లేదనిన్ని శాపకల్పకుడే ఒప్పుకొనుచుండగా మీకు సందియమేల; ఆ పురాణము నాగరిముతో బొంబాయిలోనూ, తెనుగున చెన్నపట్నములోనూ, అచ్చుపడియున్నది. వాటిని తెప్పించుకొని మీరు చూడవచ్చును.

మరికొందరు "కలావాద్యంతయోస్థితిః" అని ఒకవాక్యమున్నదనిన్ని ఇందుకు అనేకులు అనేక విపరీతార్థములను చెప్పి మనుష్యులను భ్రమింపజేయుచున్నారు. అది సరికాదు. ఏవాక్యముయొక్క అర్థమును న్యాయముగ తెలుసుకొనవలయునని ఉద్దేశమున్నయెడల ఆవాక్యము ఏగ్రంథమునందు ఏ సంబంధమందు చెప్పంబడినది తెలుసుకొననిది యథార్థజ్ఞానము తెలియనేరదు. ఈ వాక్యము మేము చూచినంతవరకు విన్నంతవరకు నేగ్రంథమునందులేదు. ఏగ్రంథములోనైనా మహానుభావులు చూపించినయెడల అప్పుడు దానికి సరియైన అర్థము కనుగొనవచ్చును. ఈ వాక్యమునకు చెప్పెడి విపరీతార్థమును వినవలెననెడి కుతూహలమున్నయెడల చెప్పెద వినుడి.

"ఆద్యంతయోస్థితిః" ఇందుకు పదచ్ఛేదము. 'ఆద్యంతయోః' । 'స్థితిః' ।

అర్థము. ఆదియొక్క అంతముయొక్క స్థితి—సాధారణముగా నాలుగువర్ణములని వాడుకలోనున్నను 5 వర్ణములు వేదప్రసిద్ధి అయ్యున్నవి.

"పఞ్చజనామమహోత్రం జుషధ్వం" అను ఇత్యాది అనేక వేదవాక్యములు కలవు. ఇందుకు యాస్క మహాముని చెప్పిన నిరుక్తమందు వ్రాసినదేమనగా,

"చత్వారో వర్ణానిషాదః పఞ్చమ ఇత్యౌపమన్యవోనిషాదః (నిరుక్తం) ౨ వాల్యం। పుట ౨౭౮॥

దీని అర్థము। ఔపమన్యుడను మహామునియొక్క తాత్పర్య ప్రకారము నిషాదులతోకూడా మనుష్యులు 5 భాగములయినటుల కనుపించుచున్నది. భాష్యమందు "తత్రపంచజనా ఇతి ఏతస్యనిగమాభవంతి నిషాద పఞ్చమావర్ణాః॥" (పేజి ౨౭౯.)

ఆదివర్ణమయిన బ్రాహ్మణులు పంచమవర్ణమయిన నిషాదులు అనగ అంత్యవర్ణము వారు. వీరిద్దరికి ఏకస్థితి కలుగుచున్నదనిన్ని, అనగా బ్రాహ్మణులు పఞ్చములసేవచేస్తూ పంచములవలెనె నటించుదురని కొందరున్నూ, 4 వర్ణములుగానెయెంచి అంత్యవర్ణము వారనగా శూద్రులనిన్ని వారితో బ్రాహ్మణులు ఏకస్థితిగానుందురని కొందరున్నూ చెప్పుదురు. పూర్వాపరసందర్భములు తెలియనిది ఇట్టి అర్థమును మనమంగీకరించ వచ్చునా; వివేకులు అందుకు ఒప్పుకొనెదరా; గనుక మనము ఈ అర్థమును ఈవాక్యమును వాక్యముయొక్క ప్రమాణము తెలిసేవరకు వాడుకొనకూడదు. అటులచేసెనేని పాతకము. మరికొందరు నిటువంటి విపరీతార్థమునే చెప్పుదురు, అదియును మనకు భావ్యముకాదు.

"పంచజనానాం ఆద్యంతయోః" అని

ఆదియైన బ్రాహ్మణులయొక్కయు అన్తమయిన పఞ్చములయొక్కయు స్థితి అనగా ఉనికిమాత్రమే కలదనిన్ని, ఈమధ్యవారయిన క్షత్రియ వైశ్యశూద్రులు కలియుగమునందు లేరనిన్ని, మరికొందరాద్యంతములనగా "చతుర్ వర్ణానాం ఆద్యంత యోః" అని బ్రాహ్మణ శూద్రులయొక్క స్థితికలదనిన్ని, మధ్యస్థులయిన క్షత్రియవైశ్యులుతేరని మరికొందరున్నూ, "ద్విజానామాద్యంతయోః" అని యర్థము చెప్పి బ్రాహ్మణవైశ్యులుమాత్రమే కలరనిన్ని, క్షత్రియులు లేరనిన్ని, ఇటువంటి విపరీతార్థములను చెప్పుచున్నారు. వీటిని మనమెంతమాత్రమంగీకరించకూడదు.

• మరికొందరు "నందాంతంబ్రాహ్మణకులం" అనిన్ని, మరికొందరు "నందాంతం క్షత్రియకులం" అనిన్ని, "నందాంతం వైశ్యకులం" అని మరికొందరున్నూ, నందునితో బ్రాహ్మణవంశము నశించినదని కొందరున్నూ, నందునితో వైశ్యవంశము నశించినదని కొందరున్నూ, నందునితో క్షత్రియవంశము నశించినదని కొందరున్నూ, వైషమ్య వాక్యములను ప్రయోగించి ఒకవర్ణమువారు మరియొకవర్ణమువారిని నిందించుచున్నారు. ఇందువలననే మనలో నైకమత్యము నశించి బహూ హీనస్థితిని బొందుచున్నాము. గనుక నింతటినుంచియైనను ఏవర్ణమువారిలోనైన లోపములున్నయడల

వాటిని సవరణచేయుటకు ప్రయత్నముచేసి సర్వవర్ణములవారు వారి విహితములయిన కర్మలను విధిగా జరుపుకొనుచు నిహపరసౌఖ్యముల నొందవలయునని భగవంతుని ప్రార్థించుచున్నాము.

తెలిసిగాని తెలియకగాని కర్మలోప మంత్రలోప క్రియాలోపములనుగాని వ్యత్యయములనుగాని జరిగించుచున్నయెడల వాటి లోపపరిహారముకొరకు మంత్రత్రయమును బఠించుచున్నారముగదా. ఈ మంత్రములను బఠించుచు వాటియర్థమును గ్రహించుచు నిదివరకు జరిగిన వ్యత్యయలోపములకుగాను సర్వప్రాయశ్చిత్తమును చేసుకొని యథోక్తకర్మలయందు ప్రవర్తించుట యుచితముగాని నిదివరకు లోపముజరిగినది గనుక అట్టివాడెప్పటికీ పునీతుడు కావడమునకు వీలులేదను అపభ్రంశవాదమును విడువుడు. పయినిచెప్పిన మంత్రత్రయము నిచట చెప్పుచున్నాము.

అనాజ్ఞాతంయదాజ్ఞాతంయజ్ఞస్యక్రియతే మిథు । అగ్నే తదస్య కల్పయత్వగ్ంహి వేత్థయథాతథమ్ ॥

"పురుషసమ్మితో యజ్ఞోయజ్ఞః పురుషసమ్మితః । అగ్నే తదస్య కల్పయత్వగ్ంహి వేత్థయథాతథమ్"

"యత్పాకత్రా మనసాదీనదక్షాన। యజ్ఞస్యమన్వతే మర్త్యాసః । అగ్నిష్టద్ధోతా క్రతువిద్విజానన్ । యజిష్ఠోదేవాగ్ంబుతశో యజాతి"॥ తై॥ బ్రా॥ 3, 2, 11.

ఈ మూడుమంత్రములకు వ్యాఖ్యానము.

"యజ్ఞస్య = విహితకర్మణః సంబంధికి యదంగం, అనాజ్ఞాతం = శాస్త్రక్రమేణ అస్మాభిః అజ్ఞాతంసత్, యత్ = యద్యపి, ఆజ్ఞాతం = సమ్యక్ విజ్ఞాతంసత్, మిథు = మిథ్యానామ, మంత్రతంత్రస్వరవర్ణకాలవ్యత్యయరూపేణవా మంత్రతంత్ర స్వరవర్ణకాలలోపరూపేణవా, కృతః = క్రియతే జానాత్ అజ్ఞానాద్వా అన్యథా అనుష్ఠీయతే, హేఅగ్నే = పరమేశ్వర, అస్య = కర్మణః సంబంధి, తత్ = సర్వం పూర్వోక్తలోపరాహిత్యేన యథోక్త కర్మఫలప్రదనసమర్థంకురు ॥ హి = యస్మాత్కారణాత్, త్వం = త్వమేవ, యథాతథం =

వస్తుతత్వం, వేత్థ=జానాసి. యః=యజ్ఞః, సోయంపురుషసంమితః = పురుషసదృశః, యథాపురుషోయం అన్యూనాతిరిక్తవిశిష్టావయవః తథా యజ్ఞోపి, కించాపి, అయం=యజ్ఞః, పురుషసమ్మితః=పురుషేణ సమ్యక్ నిర్మితశ్చ యస్మాదేవం తస్మాత్, హే అగ్నే=తదస్య ఇత్యాదిపూర్వవత్ ॥ పాకత్రా॥, పాకః=బాలః - తద్వదస్యైస్త్రాయంతె రక్షన్త ఇతి పాకత్రాః, బాలవదప్రబుద్ధమతయః, దీనదక్షాః = క్షీణోత్సాహాః, మర్త్యాసః,=మరణశీలాః మనుష్యాః, యస్యాస్య కర్మణః, యత్=అంగం, మనసా=స్వకీయేన, న+మను తె=నావబుధ్యన్తె, తత్, అంగం, విజానన్=జ్ఞానవాన్, క్రతువిత్ కృత్స్నయాగాభిజ్ఞః, యజిష్ఠః, అతిశయెన యష్టుం సమర్థః, హోతా=దేవనామాహ్వాతా, అగ్నిః=పరమేశ్వరః, దేవాన్=యష్టవ్యాన్, ఋతశోయజాతి=తత్తదృతుకాలె పూజయతి॥ యథావయం తత్ దేవాభిధానం పరమేశ్వరం యథాకాలం పూజయామః తథాస్మాన్ ప్రేరయతీత్యర్థః''॥

"ఏతస్మిన్కర్మణి మంత్ర తంత్ర స్వరకాలవర్ణలోపాది సర్వదోష నిహారణార్థం అనాజ్ఞాత్రయ మంత్ర జపంకరిష్యే'' అని సంకల్పము.

ఇటువంటి మహామంత్రములు కాలవ్యత్యయదోషమును పరిహరించలేవనిసే ద్విజుడయినను వాదించగలడా?॥

గనుక వేదోక్తవిషయమై మీరందరు శ్రద్ధచేయుడీ.

శూద్రులనగ నెవ్వరో శూద్రులకు ఎటువంటి అధికారముకలదో అనెడి సంగతినిగురించి ప్రత్యేక ముపన్యాసము చేయబడును.